# సంచలనం



వేమూరి వెంకటరామనాథం

# తొలిపలుకు



రసవంతమును విషాదకరమును దేశక్షోభా కూలాల కారణమునయిన సంయుక్త చరిత్రను రామనాథం రెంకురంగముల నాటకముగాఁ దీర్చివ్రాసి చదివి వినిపింపఁగా నానందించితిని. కావ్యరచనలోఁ బ్రధానాంశములు రెండు: కూర్పు, శైలి. ఈ రెంటియందును నీనాటకము సర్వవిధముల గణనీయముగనుఁ, బ్రశస్తముగను నున్నది.

చరిత్రకారులనేకాక కవులనుగూడ ననేక శతాబ్దముల నుండి యనవసితముగ నాకర్షించుచు, రసభావమును బ్రజ్వరిల్లఁజేయు గొప్ప యితిహాసములలో సంయుక్త చరిత్ర యొకటి. సంయుక్త ధీరురాలు. మహాపతివ్రత. సావిత్రి విధముగ నాత్మను సమర్పించినవానికి శరీరమును సమర్పించి తనజీవితమును త్రికరణ పవిత్రముగ నడిపినది. వరుఁడును బురుషుఁడును నైన పృథురాజు మహావీరుఁడు. తానును మానసికమైన వలపునుబట్టి, తన్నునమ్మి తపస్సుచేసినదా యనునంతటి వ్రతగరిష్ఠురాలైన వధువుయొక్క యభీష్టము నెన్నికష్టములకైనను సరే యోర్చి, ప్రాణముపైకి వచ్చునంతటి సాహసమొనర్చి నెరవేర్చిన యుదాత్తుఁడైన, ధన్యుఁడు. అయినను, కాలసంఘటనముయొక్క విచిత్రమేమందుము! వీరి పరస్పరానందము

హిందూదేశముయొక్క స్వాతంత్ర్య వినాశకారియైన మహాక్షోభకు హేతుప్రకాశమన్నను దారుణమాయెను. వారికమృతము దేశమునకు విషము. ఇట్టి వైపరీత్యములతో నిండిన యీ వృత్తాంతమును రామనాథం చక్కగఁ బ్రదర్శించి భాషకును దేశమునకును మేలుచేసినందులకు నేనెంతయు సంతసించితిని. మనవారనేకులు రచించినట్లు చక్కని ప్రదర్శనమునకసాధ్యమైన పుంఖానుపుంఖరంగసంచయముతో నీనాటకము దుష్టము కాలేదు. మఱి, భాగములయినను రంగములు రెండు. పృథురాజ నగరును, స్థానేశ్వర సంగరరంగమును ప్రేక్షకులయెదుటఁ గంటికిఁ గట్టినట్లు నాటకవేదిపై సాక్షాత్తుగా నిరూపించుట సుసాధ్యము. మననాటకము లనేకములు చదువుటకుఁ బనికి వచ్చునే కాని, ప్రదర్శనయోగ్యములు కావు. అనఁగా, నెయ్యది నాటకముయొక్క జీవకళయో, యాప్రాణమే లేనివన్నమాట! రామనాథం ఈ విషయములో నిజమైన కళాపోషణము చేసినాఁడు. మార్గదర్శకుఁడై యనుచరత్వసిద్ధిని బొందుఁగాక!

ఈ నాటకమును జదివినప్పుడు మనస్సునకొక గొప్ప సంశయము తట్టకమానదు. వ్యక్తులయొక్క సుఖము దేశముయొక్క దుఃఖమునకు మూలమగుట, దేశముయొక్క సుఖము వ్యక్తులయొక్క దుఃఖమునకు విధియగుట—ఎందులకీ పరస్పర వైషమ్యములఁ గరుణామయుండును సర్వశక్తి సమేతుండును

నయిన భగవంతుఁడు కల్పించినాఁడో! మానవునియొక్క జీవితప్రయాణములో 'ముందు నుయ్యి వెనుక గొయ్యి' యనునదియేనా సనాతనమును శాశ్వతమును నయిన పరిస్థితి?

ఆంధ్రవిశ్వకళాపరిషత్,
గుంటూరు,
14—9—1944.

కట్టమంచి రామలింగారెడ్డి

# పరిచయము



ఆత్మత్యాగమునకు వెఱగందక, తనవలపునకుఁ బరిణయఫలము కల్పించుకొన్న హైందవనారీమణి సంయుక్త. భయంకర సంగరసాన్నిహిత్య మెఱింగియు, వలచిన వనితను జేఁబట్టి, యార్యధర్మమును మ్రింగఁజూచు పరదురభిమానము నడికట్టఁ జెలరేగిన రసపుత్రవీరుఁడు పృథ్వీరాజు. ఈసు, ఆస పూని మోసమంది నాశమొందిన విషాదజీవి జయచంద్రుఁడు. సంయుక్త కథలోఁగల యనంతాకర్షణను శ్రీ రామలింగారెడ్డి గారు తమ సహజభావనైశిత్యముతో 'తొలిపలుకు' లో విపులీకరించియున్నారు. నా రచనను దయతో వినుటయే కాక, తమ్ము నాకర్షించిన సంయుక్త చరిత్రసంవిధానము నపూర్వ విమర్శకదృష్టితో వివరించిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

గారికి వందనసహస్రము లర్పించుచున్నాను. ఆంధ్రభాషా సేవలో నందెవేసిన సిద్ధహస్తులగు శ్రీ రెడ్డిగారి తొలిపలుకుల నాశీర్వచనములుగ గ్రహింతును.

నా యీ తొలిరచనను సమగ్రముగఁ బరిశీలించి, యమూల్యములగు సవరణలననేకముల నొనర్చిన శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారికిఁ గృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

పుస్తక ముద్రణమున శ్రద్ధవహించి, యత్యంత వాత్సల్యముతో ప్రూఫులనుసరిచేసిన శ్రీ కురుగంటి సీతారామయ్య గారికి నా వందనములు.

ఇందలి చిత్రములను వ్రాసిన మిత్రులు శ్రీ శ్రీపాద జగన్నాథంగారికి నా కృతజ్ఞతలు.

వేమూరి వేంకటరామనాథం,
ఆంధ్ర విశ్వకళాపరిషత్.




## ప్రథమరంగము—ఢిల్లీనగరము

సంయుక్తను పెండ్లియాడి పృథ్వీరాజు ఢిల్లీనగరమునఁ బ్రవేశించును. ఆస్థానకవులు సంతోషమునఁ బద్యములఁ జదువుదురు.

ఈ నవసంధ్యాలందు విరియించిన పూవుచెండంద దాఁగి, కా
మానన ముక్తమోహనస్వగంతచిరస్మిత ప్రసిద్ధమౌ
తేనెల నిండుజవ్వన మదృశ్యముగాఁదమ పెండ్లిపందిటన్
వానలవోలెఁ జల్కెడు ప్రభాతకుమారిని గంటివే, ప్రభూ!

అతిమాధురానుభావయుతమౌ తమ పెండిలియాట నుత్సవ
ప్రతతి మదించియున్నవివి శ్యామలచారు నవారుణక్షణాల్;
అతి రుచిరమ్ములౌ గతిఁ ద్వాదస్వయరేఖలఁ దీర్చిదిద్దు సం
తత రమణీయపుష్పిత లతామృదులేఖిని లీక్షణంబునన్.

కవితావాహిని గట్లుత్రెంపికొని, శృంగారపరిపూర్ణమ్ములై
న వసంతారుణ లాక్షలంగలిసి, మీ వాంకాంగనాలోచనో
ద్భవముల్ ప్రేమపయస్తరంగముల సొంపారంగముంచెత్తి, మీ
నవదాంపత్యలతన్ జిగుర్పనెగసెన్ వైహాయసోల్లాసమై.

ఆశావిస్తృత నాట్యభంగిమ నిమగ్నా యత్తమా కీర్తికాం
తాసాంపర్క్యము, భారతీమృదుల వీణాధ్వాన సంరంభమున్,
"దాసోహ" మ్మని సల్పియున్న రమ, మీదాంపత్య సంశోభిత
ప్రాసాదమ్మున బ్రాకృతాభరణముల్, రాణ్మౌళి, పృథ్వీశ్వరా.

తరుణారతీస్మితాంకిత లతాంతనితాంత శరాభ్రముల్ సుధా
ఝురులనుజిల్కు సొంపెసఁగఁజాలిన మీ ప్రణయార్ద్రిమా పర
స్పర హృదయానురక్తి వసివాడనితావుల పూలప్రోవుగా
శరతతికిన్ మెఱుంగులిడె, జాయఁదర్పాన్వితఁ జేయ మారుఁడే!

మీ వైవాహికశోభ దివ్యరుచిరమ్మే; మున్ను గాంధర్వపుం
దావుల్ చిమ్ముచు రుక్మిణీసతి జగన్నాథుండు పెండ్లాడె; నేఁ
డే వీణాకలకంఠినొందితివి పృథ్వీనాథ యర్ధాంగిగా;
"నావిష్ణుఃపృథివీప" యన్న నుడి విన్నామిందుఁ జెల్లంగదా!



# సంయుక్త

సంయుక్త, చెలియలు, నూతనవసువు నలరించుచుఁ బల్కుదురు.

ఈ నవోషో నృత్యవేషా
స్థాన శోభా స్నానకేళీ
ముదిత మోహన హృదయుఁ డవుగో
మదన సమార్పిట్టు.

చందనానిల మందసౌరభ
తుందిల ప్రసవేంద్రమందిర
ముందు మన్మథ సుందరాంగుని
వింద వయితి వహో!

మరుఁడు హింసా నిరతుఁడోయీ,
కనుల కందక కాల్చునోయీ,
ప్రథిత యౌవన వధువవోయీ,
సావధాన మహో!

మృదు మరంద స్పృహాసంగత
భృంగసంగమ రంగశాలలు
అరుణ జలరుహ తరుణరేఖలు
నిరిసె, సంయుక్తా.

ప్రణయ రాగార్ణవ తరంగము
లావరించిన వాననమ్మున;
దొలి బెదరు సిగ్గుల కనుంగవ
యలరె మీలవలెన్.

ప్రథమ చుంబన సుధాచలితా
ధరవిముక్త స్వరధునీతతి
మేళవింపుము పూలసెజ్జల
తేటి పాటలతో.

"చెలులగుమి నాప్రియతమ" మ్మను
పలుకు లపుడే మఱచినావే?
వలపు రూపై నిలుచు నాధుని
తొలి కవుంగిలికే?



## సంయుక్త

సంయుక్త తండ్రి జయచంద్రుఁడు పృథ్వీరాజుపైని కక్షచే మహమ్మద్
ఘోరీ సాహాయ్యముతోఁ బోరుటకుఁ గాలుదువ్వును.
పృథ్వీరాజు యుద్ధసన్నద్ధుఁ డగుచుండును.

### పృథ్వీరాజు

మృత్తికా చిత్రమ్ము ప్రేమించి, దానఁ
గుసుమ మాలనువైచి యశమునుగన్న
వెలఁది వొక్కతె వీవె వెఱ్ఱి సంయుక్త!
ద్వారపాలక వేషధారి నన్ జేసి
నీతండ్రి నిక్కంబునే వెల్లడించె;
భవదీయ పితృసభాభవనంపు ద్వాస్థుఁ
డను గానులెమ్ము; నీప్రణయ సౌధమ్ము
సోపానములనిల్చి, నీప్రేమ లోచ
నామృతఝరుల నానందోన్మదమున
మునుకలు వేయుగ్రామ్యుఁడనేను జెలియ!

శిలను వెలందిగాఁ జేసిన యార్ష
వాత్సల్యశక్తి నీస్వాంతగర్భమున
జతియించి దాఁగెనో, చిత్రమ్మునందు
జీవ చైతన్యమ్ము చిందించు కొఱకు!

## సంయుక్త

చిత్రమైనను శిల్పమైనను,
వలపు లొలికెడు ప్రాణవల్లభుఁ
జెట్టవట్టుట చెలువ ధర్మము
భారతావనిలో.

ద్వారపాలక పరిభవానల
తప్తమైన యెదన్ మదీయ
ప్రణయ పారావార మందునఁ
దేల్చి చల్లార్తున్.

బుసలు గొట్టుచుఁ బొంగిపొరలెడు
హృదిని మీ కర్పించికొంటిని;
జలకణము రవి కిరణపంక్తుల
లీనమై నటులు.

## పృథ్వీరాజు

నా ప్రేమమయి! యర్పణము సేసికొంటి
నీయభాగ్యున కెంతహిత చింతనమ్మొ!
ఆణి ముత్తెముచిప్ప నలరించుస్వాతి
వర్షకణమ్ము కైవడిఁ; జకోరమ్ము
నెనయింప విరియు వెన్నెల తీవెవోలె.

మేలి నీలి మొయిళ్ళ మెలికల మించు
కన్బొమల్ విచ్చి నీ కడగంటివలపు
వానజల్లుల ముంచివైచెడి నన్ను.

వాసంత కిసలయ ప్రసవస్మితమ్ము
భాసిల్లు మసృణ లావణ్యాస్యవీవు.

సంయుక్త

పండువెన్నెలఁ బరిహాసించెడు
నిండుప్రేమ కిరవులౌ మీ
జంటకన్నులు చక్కలింతల
మరులు గొలిపెడివి.

మదనసౌధ ప్రాంగణమ్మున
మదిరఁ ద్రావిన యీ నిశాంగన
చిదిపి చిందెను దశదిశలలో
మధు వికారములన్.

కుహుకుహూ యను కోకిలశ్రుతు,
లెగసి పర్వెన వీ నిశాస్థలి;
ముగ్ధచుంబన బద్ధజీవుల
ప్రియ రహస్యాలు.

పృథ్వీరాజు

రమ్యమౌ సరస సల్లాపంబులేల
తెల్లవోయిన వెన్నెలల్లాడువేళ?
వినఁబడుచున్నవి......

సంయుక్త

ఆశలెగసిన నా శిరీష
స్వాంతశయ్యను నెంతో వేల్చెదుఁ
జెలవికందని ములుకు మ్రోతలు;
మీకు నంతేనా?

ఏటిగట్టుల పాటి తుంగల
దూసికొని యాకాశవీథుల
గంతులాడెడు గండ్ర గాలుల
పర్వులివి యేమో!

పృథ్వీరాజు

వినఁబడుచున్న వేవేవో యవ్యక్త
మధురధ్వనులు గావు; మానినీ మృదుల
హృదయ దుర్భరములౌ నెలుఁగులుసుమ్ము!

ఈ యెడారి తుపాను లెగసినయపుడు
చెలరేగు భీకరానిలఘోషలందు
నడయాడు పీనుఁగుల్ వెడలించునట్టి
లయకాల దుర్భరారావముల్ సుమ్ము.

విశ్వవాత్సల్యమ్ము వితునకేని
లేకుండఁ బోనాడి వీఁక న్వహించి
యూరక పోరెడువారి నడంపఁ
బ్రళయ దేవుఁడొనర్చు భయదగర్జనలు!

మాత్సర్య మత్తులై మాతృ విద్రోహ
చింతనాసక్తులౌ చెనఁటులఁ జంప
రక్తవల్కలముల రణదేవుఁడొసఁగు
నాహ్వాన హుంకార మదిగో సంయుక్త!

సంయుక్త

[చకితయై]

నాధ, మీమృదు లాధరబంది
తుఁ్రటిని బంగరు పటిమ గన్నది;
కుసుమ మృదు లాశ్లేష సౌఖ్య
మ్మొదుకుబుస లీను.

విశ్వ మంతయు విస్మృతమ్మాన్న
స్వప్న సామ్రాజ్యాని కెగసెదు

ప్రణయరూపా, రణోన్మత్తా
కారమందితివే!

### పృథ్వీరాజు

సంయుక్తా, యెఱుఁగవే జయచంద్రు కరణి?
భారత రత్నగర్భము దొంగిలించి
కాబూలు గద్దెలోఁ గరఁగింపనున్న
ఘోరికి, స్వేచ్ఛారమా రేఖఁ జెఱిపి
భరతపతాకఁ ద్రపాసిక్తఁ జేయ
నాఁకొన్నమ్లేచ్ఛసేనానికి హైంద
వక్షాత్రపతనమే దీక్షగాఁగొన్న
పరదేశవాసికి, బహుళ ప్రమోద
భరితుఁడై సాహాయ్య భాగ్యమ్ము నొసఁగి,
పృథ్వీశుపైఁ బంపె, నెఱుఁగవే చెలియ?

పద్మకాంతుల నడంపఁగ భానుదేవు
ప్రస్థానమును దిమిరాగమనంబు
వాంఛించు కల్వలవగిది, సంయుక్త!

### సంయుక్త

ప్రాణసఖినయి బ్రదుకు బాటలఁ
దేనె వాకలఁ దేల్తునని నే
రాస లందితె స్వార్థమూర్తిని
గాంచి ప్రేమించి?

తేఁటి వ్రాలిన తీపి మైకముఁ
జేసి రెక్కల మూసికొను చెం
గలువ వలెనే వలపుటాసల
స్వార్థ నయితిఁ గదా!

శారదాకాశమ్ము భీకర
నీలనీరదనృత్య శాలగఁ
జేసి నర్తించెడి తటిల్లత
కరణి ప్రాణసఖా!

పృథ్వీరాజు

కాదు, నీప్రణయసుధాధారలందు
నభిషిక్తఁ జేసితి వతివరో నన్ను.
దాన నీదోస మింతేనియు లేదు,
దోసమేయున్న నా దొకక్కటేకాని;
ఓ సితస్మితగండభాసి, సంయుక్త!

సంయుక్త

కాదు—నాకుఁ బ్రమోద మొదవఁగఁ
బలుకుచుంటివి; తెలియ లేనా
నేను దెచ్చిన యీ విపత్సం
పదల నన్నింటి?

పృథ్వీరాజు

ఆఁగు మీవనినట్లె యవియెల్లనీదు
వలని విపత్సంపదలె యైన, నవియు
సంపదలేగదా, చాలదా నాకు?

సంయుక్త

అంగవల్లరి నల్లుకొన్న ప్రి
యానుకంప రహస్య వేదన
నణఁచి కొనలేనైతిఁ, గేవల
మబలహృదయఁ గదా!

పృథ్వీరాజు

సంయుక్త, నీవచస్సరణి యిదేమి?
నిత్యశీతలహిమానీ తరంగములఁ
దలపించు పలుకు సోనలఁ జిల్కెనోయి.

అరుల శిరములూడ్చు కరవాలమునకుఁ
బదనిచ్చు రసపుత్రహృదయమ్ముతోడ
నుత్సాహమున యుద్ధమొనరింతుఁ జెలియ!

పౌరుషమ్మె యుగ్గుపాలుగాఁ ద్రావు
రాజపుత్రుఁడనన్న రాణఁ బోసినను;

ఆర్షధర్మప్రవాహమ్మునకెల్ల
నాసకట్టలఁగట్టు నజ్ఞానుతోడి
మతయుద్ధమిదియని మఱచిపోనోయి;
దురభిమానమ్మున దుహితృస్వయంవ
రమ్మున నిజశాసనమ్ములఁజేయు
జనకదురాచార మణఁచివేయంగ
రాజిల్లు ఘోరసంగ్రామమిదంచు
నుత్సాహమున యుద్ధమొనరింతుఁజెలియ!

సంయుక్త

కానిఘోరమ్మైన యీజని
వేనవేలుగ సేనలున్న మ
హామ్మదును బోరాడఁగలరా
యలఁతి మూకలతో!

పృథ్వీరాజు

పోరున జయమంద భుజసంఖ్యయేల,
వెఱపునందని క్షాత్రవీర్యంబుదక్క?

మతవిషయమ్ముగా, మద్విషయముగ,
సాంఘికంబుగ, దేశసంబద్ధముగను,

నెల్ల భారతజను లింపులుగుల్క
నుత్సాహమున యుద్ధమొనరింతుఁ జెలియ!

ఈ కారుటమవసి యిరులనుజీల్చి
యందాలుఁ జిందు నుషాంగనారాగ
ధాగధగ్యమ్ములోఁ దాఁగొన్న రుచులఁ,
బ్రాభాతనీరజ శోభలు రవికి
నాహ్వానముగ నెత్తు నరుణనీరాజ
నమ్ములఁదోలుకాడు నవ్యదీప్తులను,

ప్రకృతిలోఁగల రక్తవర్ణాలనెల్ల
నాధైర్యశౌర్యముల్ నవ్యతనంద,
నుత్సాహమున యుద్ధమొనరింతుఁ జెలియ!

అందాఁకనేల, ప్రియా, నీగులాబి
చెక్కిళ్ళఁ జిందాడు చిన్నారిహాయులు
మురిపెంపుముద్దుల మోమునహత్తి
కొని మదోద్ధతిని నాజినిగేలనిత్తు.

విజయలక్ష్మినివరియించి, వెలఁది నీకు
సవతిపోరు ఘటించెద, సమ్మతమ్మ?

## సంయుక్త

ఫాలభాగ విశాలకుంకుమ
కళలెచాలు, సఖా, విరోధము
తెల్లఁబాఱఁగ, నింకసవతుల
పోరు నాకలెక్కా?

*　　*　　*

వలచిరి పెండ్లియాడిరి శుభానుభవ ప్రభవైక తృష్ణచేఁ;
గలఁచిరి రెచ్చగొట్టిరి సకల్మష.మూర్తిఁగ నోచి భూపతిం;
బిలిచిరి పెద్దసేసిరి సమృద్ధవిజృంభిత శాత్రవాగ్నినిం;
బులిమిరి తెచ్చివెట్టిరి యభూత మదృష్టమదేదొ భారతిన్.

తెలతెలవాఱెఁ గ్రొంబసిమి తీర్చిన తేజవరాలికట్ల సొబం
గులు; దెసలెల్ల నెత్తురులకోన లొనర్చె చెలంగె నీయుష
స్సులు; తెలిగండుకోయిలలు సుక్కివడంకగఁ గ్రమ్మోగ
ఘూకముల్;
తొలికిరణమ్ములందె రవి రూక్షతమేక్షణ పర్వొనర్చెపై.

నొసటన్ లేదొలిసంజలం దరుణసిందూరంపు సింగారపుం
బసిమిన్ దాల్చు ప్రభాతలక్ష్మి ముఖబింబం బెల్ల రక్తార్ణసం
భృశమైపోయెఁ; దుషారబిందుకలితోర్వీసీమ ఝంఝామరుత్
ప్రసరోద్ధూత మయూఖవహ్నికణ తప్తంబయ్యె నొక్కుమ్మడిన్

అకటా, యీనాయొకరాచకన్నె వలపుల్ స్వాతంత్ర్య లక్ష్మీకపో
లకళాహైన్యముఁగూర్చెనే? భరతధర్మజ్వాలనార్ద్రమ్ముగా
నొక సౌగంధశిరీషముగ్ధహృదయ మ్మూర్పుల్ నివాళింపఁగన్
వికచస్నిగ్ధత లేక రాలవలెనే పృథ్వీస్థలిన్ శల్యమై?

అధికోద్రిక్త కురుక్షితిం గలఁచు నా యష్టాదశాక్షౌహిణీ
రుధిరాగాధ చలత్తరంగిణులు పర్వుల్ వెట్టి స్థానేశ్వర
ప్రధనక్షోణిని గడ్డకట్టికొనెనో, వైవాహికానంద దు
ర్వ్యధగా, భారతగర్భశోకకథగా, రేఁగెన్ దురంబక్కటా!

ఆయజిమీరు రాణి తరుణారుణిమల్ రవిపాద పంక్తిలో
నూయెలలూఁగి సంకలనమొందెను; బెండిలి పచ్చతోరణాల్
సాయకసంచయమ్ములయి చల్లెఁ బరాస్రకణంబులనీ; బ్రియా
ధ్యాయము విచ్చియే ప్రళయదౌష్ట్యము రేఁగునా ఝిల్లిగీతలో.





# సంయుక్త

## ద్వితీయరంగము—స్థానేశ్వరము

జయచంద్రుఁడు నిజశిబిరములో సంతోషపరీతస్వాంతుఁడై కూర్చుండును. అది సాయంసమయము. దూరమున సంయుక్త వచ్చుచుండుట గమనించును.

### జయచంద్రుడు

నతకుసుమాళి మందచలనమ్ముల సాధ్యమరందబిందు సం
తతి జయచంద్రదోర్విజయదర్పముఁ బెంపఁగ నొల్లుచున్న యీ
యతిరుచిరస్ఫురత్సమయమ్ముల వెన్నెలతీవవోలె నె
వ్వ తెనిటు వచ్చుచుంటివి, శుభమ్ములు రూపయిచేరునట్లుగా?

### సంయుక్త

[ప్రవేశించి, దరిఁజేరి]

వలవలయేడ్చు భారతము బాష్పకణంబులు వింధ్యపర్వతాం
చలములఁజింది కాల్వలయినగి కనోజిని ముంచివేయఁగాఁ
గలకలలాడునే మొగము? కాంక్షఫలించిన కాంతిరేఖ క
న్గొలకులనాట్యమాడునె? సుఖోన్ముఖుఁడై వెలుఁగంగఁజూచెదే?

వివిధఫలప్రసూన పదవీకలితమ్ముగు నందనమ్ము హైమం
దవధరణీతలమ్ము; లలితమ్ముగు తెమ్మెరజిమ్ము పూవులుం
జివురులలేసొబంగు సరిసేయఁగఁగల్గిన తోటమాలి నీ
వవుర, యెడారివానిఁ బిలువందగునా మఱితోఁట కాఁపుగా?

జయచంద్రుండును బృథ్వినాథుఁడొక్కఁడై సఖ్యంబుమైనిల్వ, ని
ర్భయ నిద్రారతినొందు నీభరతసర్వస్వమ్ము; లేదా తరు
ద్వయసంఘర్షణచే జనించు ననలజ్వాలాప్రభావంబులో
క్షయముంబొందు నరణ్యమాను మనదేశం బద్దియుందోఁచదా?

కొఱుకఁగరాని దానికయి కోరలుసాచి, జయమ్ము నిక్కమన్
గరువములో మునింగితివి; కప్పను బట్టిన పాము చందమా;
సురదరహాసపూరపరిశోభలఁదేలెడు రాజహంస పం
జరమునఁ జిక్కి వచ్చునె విజాతి వినిర్మిత శృంఖలమ్ములన్?

నీలాభ్రమ్ములఁ జీల్చి ధారుణికిఁ గాంతిం గూర్చు సౌదామనీ
లీలన్, గాఢ తమస్సులందటిమి భూరిస్ఫూర్తి కల్గించు ఛా
యాలావణ్యవినోది భాస్కరుని పాదాంతమ్ముగా, మీ బలం
బాలం బందునఁ ద్రుంచు పృథ్వీపతి దృశ్యం బింత
యూహింపుమా.

పృథివీశుఁడై జనించినాఁడు మన ఢిల్లీ రాజ్య లక్ష్మీశుఁడై;
ప్రధనాంతమ్మున ఘోరమే భరత బాష్ప శ్రేణిలోఁ దేలునా...

శిథిలప్రాభవ సింహపీఠమున నాసీనుండు కావచ్చు; నీ
క్షణమాత్రప్రాగ్వై నిల్చిమ్రింగునిను; నాసూక్తుల్ నిజంబెంతయున్

చివురులమెక్కి, తేనియలచిందులలోఁగయిపెక్కి, కోయిలల్
సవనవలాడువెన్నెల పసమ్ములనింపెడు గీతికాళికిన్
జవులొనఁగూర్చు కమ్మనివచస్సులు నీవని బుజ్జగించితి
యుపతినిముస్న; చేదయినవో మఱినేఁటికవేన కేశ్వరా?

మఁసుదపించునా తమకుమారిశరీరము కాటిపీటిలోఁ
జనిఁగిననాఁడు, పృథ్వీపతి జీవములారిననాఁడు, హైందవా
వనిహృదయమ్ములోఁగఱకుబల్లెము ఘోరియెగ్రుచ్చునప్పుడేన్,
జనములు దాస్యభారమునఁజచ్చియుఁ జావక యున్న వేళలన్?

జయచంద్రుఁడు

తనయా, నాహృదయంబుముట్టివిను నెంతల్ మోప్రతలో
మున్న శో
భన వైవాహికమంటపాన ధరణీపాలప్రకాండం 'బిసీ'
యని నన్నవ్వినవాఁడు, భీతఖగపక్షాందోళనల్ పోలు నా
వణఁకుల్ దాఁగిన వీ శ్మశానసదృశ స్వాంతంబునంజూడుమా.

సంయుక్త

ఎచటి దురాగ్రహాద్రిఘమియ్యది? నెత్తురులోఁడ్చిపల్కు నా
వచనసముచ్చయంబుమదిఁ బొడదె? నన్ గనినట్టితండ్రివే
యచల హిమాచలాగ్రశకలాకృతిఁ దాల్చెనె నీయెడంద? ద్ర
జ్నిచయము లోభసంకలన నీరసమాయెనొకో, ధరాధిపా?

## సంయుక్త

దూరమునఁ బోరుచున్న పృథ్వీశుని యుద్ధకౌశలముఁ జూచి
సంయుక్త యానందోత్తేజము నందుచుండును.

## సంయుక్త

సమరముగాదు, మృత్యురథచక్ర పరిభ్రమణమ్ముగాని, బా
ణములివిగావు, భర్గనయనాగత వహ్నికణాలుగాని, రో
షమయిది, భీషణప్రధనశక్తి శిరఃపరివేషమౌను; స
త్యముగ నమర్త్యసాధ్యరణదక్షత లీపృథివీశుకృత్యముల్.

తరలివచ్చిన వియత్పురపంక్తులరదముల్
గతిఁదప్పి యూఁగాడి చితికిపోయెఁ
గదలివచ్చినగాఢ కకుబంతములు కరుల్
మదమరి గీండ్రించి యదరిపోయె
వలసవచ్చిన శ్వేతజలదము లశ్వముల్
పదమాఁగి సకిలించి చెదరిపోయె
దిగియెవచ్చినయట్టి తెలితారలు భటాళి
వెలుఁగారి విలపించి యిలనురాలె

నాకసమ్ముఁబోలె నల్లుకొన్నట్టి వైరి
మల్లచతురంగబలమెల్లఁ జిల్లివడియె;
విజయలక్ష్మీవిలాసియౌ పృథ్వివిభుని
ప్రళయసంగ్రామ తాండవార్భటులఁ జేసి.

కొత్త కాల్వలఁబేరు పర్వెత్తినట్లు
తోఁటకాఁపరి చింతాకు దూసినట్లు
శత్రుమస్తకఖండనోత్సాహియైన
పృథ్వివిభు ఖడ్గచాలనవిధము దోఁచు.

[పృథ్వీశుఁడు శత్రుమధ్యమున దుముకుటఁజూచి]

వెలుఁగుల మెఱుపో నాథుఁడు,
తొలిభాస్కరనిశితకిరణతోరణమో, ని
ప్పులఁగ్రక్కు రుద్రశూలమొ,
తెలికన్నులఁదోఁచి త్రుటి నదృశ్యుఁడుకాఁగా.

[జయచంద్రుఁడు ప్రవేశించును. వానితో—]

కనుమా, దుర్గమపర్వతోన్నతధరాగర్భంబుభేదించి, భీ
షణభూపంకము రెచ్చఁగొట్టు ననలజ్వాలంబలెన్ పృథ్వినా
థుని సంహారపిపాసతేజమదె శత్రువ్యూహమధ్యమ్మునం
దున వజ్రాంచలతీక్ష్ణతన్విరిసెఁ; గన్నుల్ భీతినల్లాడఁగన్.

జయచంద్రుఁడు

[వికటాట్టహాసముతో—]

అంచుల్దీరిన పౌరుషప్రతిభ బాహాశక్తి సంపత్తులం
బెంచంబోరు మదీయసైనికులు పృథ్వీనాథుజీవమ్ము, నీ

ప్రాంచత్ ప్రేమనిధానమున్నలిమి, శుంభన్మోదసంరంభులై
సంచారమ్ములు సేయుచుంటఁగనుమా సంగ్రామరంగస్థలిన్.

సంయుక్త

[కన్నీరు గార్చుచు]
నిజమా, నోములపంట, పూర్వసుకృతానీకమ్ము రూపొంది నా
భుజబంధమ్మున రాలిపడ్డ సురసమ్మోదాంశ, మస్మన్ముఖాం
బుజసంఫుల్లత కింపుగూర్పఁగల యంభోజాప్తలావణ్య రే
ఖ; జయశ్రీదరహాసశోభితుఁడు స్వర్గంబందెనా, నిక్కమా?

సలసలపొంగు తేనియలజాలులలోనలరించి మిమ్ముఁ; గ్రోం
జిలుఁగు పొబంగులేఁజివురు సెజ్జలమాటున నన్ను దాఁచి; "మీ
వలపులరాణి యేది" యనిపల్కుచు దాఁగుడుమూఁతలాడు నా
చెలియలు పూవుకన్నియల చెంతకురావె, ప్రియా, మనోధవా!

తొలిరేవెన్నెలలందు మోవిపయి ముద్దుల్ పేర్చి యూరించుమీ
పలుకుల్ తెమ్మెరతావులంగలిసి నాపైఁబర్వునీవేళ; మీ
తొలికౌఁగిళ్ళబిగింపువంపులు మెయిన్ దోల్కాడు నీనాఁటికిన్,
వలపుల్ గాంచినకంటనొల్కవలెనా బాష్పాంబుసందోహముల్!

భరతారామవితర్దిమీఁద నెపుడున్ స్వాతంత్ర్యలక్ష్మీమనో
హరలావణ్యసుధాసముల్లసితగాఢాలింగనోన్మత్తుఁడౌ

ధరణీనాథు నదృశ్యమృత్యుమయ నృత్యక్షోణియౌ నాపయో
ధరశయ్యం బలితుంబొనర్చితిని స్వార్థప్రీతోత్కంఠనై.

తరులగుబురుల మున్ను నే దాఁగినపుడు
పూలతీవెల కొనలలోఁ బొంచినావు
నామృదుకరాంచలమ్ములునా భ్రమించి;

మింటితారలఁగాంచి భ్రమించినావు,
చిలిపివలపులు నిలువెల్ల పులకరింప
నింగివిరిసిన నామేని పొంగులంచు;

ద్యోతలమ్మునఁగూడ, సంయుక్తకొఱకు
తిరుగుచున్నావె నందన పరిసరాల,
నరయుచున్నావె పరిచితాంబర పథాల?

జయచంద్రుఁడు

[పృథ్వీశుఁడే వచ్చుచుంట గమనించి, తనవార్త కేవలము భ్రమయని గ్రహించి, బెదరుచూపులతో—]

కరవాలమ్ముధరించి, గంధవహవేగప్రౌఢిమోత్తుంగమౌ
తురగమ్ముంగుదియించి, భీషణశరాస్త్రకప్రతాపోన్నతుం
డరుదెంచుంగద పృథ్వీరాజు—

సంయుక్త

చనిన పృథ్వీశుఁడదుగోయుం చడరెదేల?
నింగినెగసెడు గృధ్రమ్ము నీడఁగాంచి

బడలి మెలివడి డస్సెడి పాము వోలె;
కాక, యపహాసమా పుత్రిక నురగుల్ప?

జయచంద్రుఁడు

అరుదెంచుంగద పృథ్వీరాజిటకె; సత్యమ్మిద్ది సంయుక్త, సం
గరగర్భంబున నుద్భవించిన లయోగ్రవ్యగ్రరుద్రాకృతిన్

సంయుక్త

[చూచి స్థైర్య సంతోషములతో].

ఔను, పృథ్వీశసవ్యాశ మైనట్టిమూర్తి;
శత్రుమస్తకముల రక్తచిత్రములను
వ్రాసిదిద్దెడు లేఖినుల్ మీసలవిగో,
చూడు మాటొన్న సింగంపు జూలులవిగో!

పృథ్వీరాజు

[దరిఁజేరుచు]

దుష్టజయచంద్రదంష్ట్రలఁ దూలిపడిన
ప్రాణలేశ మదెవ్వరిదో—

సంయుక్త

[ద్విగుణీకృత ధైర్యముతో]

దస్యుహృదయాల నశనిపాతమ్ము వోలె
దూసికొనిపోవు భీషణఘోషలవిగో;
పృథ్వినాథుఁడె కావలె, వేఱుకాదు.

పృథ్వీరాజు

[ఇంకను దరిఁజేరుచు]

భీతశాబకనేత్రాల జ్యోతులేవో
నూతనానందలాస్య సంతుష్టిఁజెందు.

సంయుక్త

అరుణకిరణమ్ములీను భాస్కరునికరణి
వెల్గు నరిభీకరాననబింబమదిగో;

జటిల మందారకుసుమ సంచయముఁబోలు
బుగ్గలువెడల్చు నుడుకైన పొంగులివిగో;
పృథ్విపతియేయితండు నాహృద్విహారి.

[పృథ్వీరాజు ప్రవేశించును]

కదలివచ్చితె దివ్యలోకమ్మునుండి
యమరసుధనాని, నాకు మీయధరమాన్చ?

పృథ్వీరాజు

ఉదయరాగసుధారేఖ తొల్కుచీదు
తరుణగండారుణిమల ముద్దాడుకొనుటకు
వచ్చినాఁడను——
[జలదరించి] ...నుడివోతె బాణమేమిటి

[వెనుకఁజూచి]

మ్లేచ్ఛహస్త విముక్తమౌ మృత్యులతయ?

సంయుక్త

[బాణముతగిలి పడిపోవుచు]

వలదు, ప్రాణేశ, దరికేరావలదు, చనుఁడు
మృత్యునృత్య విలాసమ్ము లీపెదవులు,
మ్లేచ్ఛశింజిని ముట్టిన హృదయమిద్ది;

పరశరవిదారితామిషప్రకరమునకుఁ
జుంబనాశ్లేషయోగ్యత సురిగిపోయె;
మాటకరవాయెఁ, జూపులే మందగించె,
నూపిరుల్ సన్నగిల్లెఁ, బృథ్వీశచంద్ర!

విగతశాత్రవవీరులై విజయలక్ష్మి
నొంది రమియింతురిగాక సంయుక్తబదులు;
కమ్రభారతమున నన్నుగన్న తండ్రి,
తుది నమస్కృతిఁగొనుఁడు నామెదఁబగిల్చి.

జయచంద్రుఁడు

[విచారముతో]

ప్రియసుత, కన్నులంబాదివి పెంచితిఁ, దెమ్మెరలీను చల్లమా
ల్లియపువ్వుదండవోలె నలరించితి ముద్దులవానలొల్కఁ; నీ

నయనవిలాసమూజిదనెనా తిమిరావృత చంద్రికాస్మిత
మ్మయి, జయచంద్రవంశ విభవాతిశయంబులు కూలిపోవఁగన్.

### పృథ్వీరాజు

[సంయుక్తనుజూచి విచారముతో]

నూజేంద్లుఁ గతియించిపోతె, మఱి నేనో, మర్త్యమాత్రుండ; పృ
థ్వీరాజ్యమ్మున నాశచేనిలిచిపోతిన్; సంగరాంతంబునఁ
బారుల్ పేర్చిన దివ్యకామినుల లావణ్యమ్ముఁ గోనీఁది స్వ
ర్గారామమ్మున నిమ్ముఁ జేరెదను గంగాసైకతశ్రేణులఁ.

అతులితరాజ్యభోగముఁ జిరాయువులై రమియింపగోరు దు
ర్మతులకె కాని కాలపరిమాణము; ప్రేమమయైకబద్ధ దం
పతులకు సుందరక్షణమె వత్సరమా, శతవర్షతుల్యమా;
సతి, పృథివీశుతో నొక నిశాస్మృతి చాలదె తృప్తి దీఱఁగన్.

[జయచంద్రునితో]

హృదయమునాపఱాయి నొనరించితివే, మదిజారివాకలఁ
గదులునె? యీసుతోడ నిటుకల్వలెనైన త్వదంశుకమ్ములున్
జిదుపునె బాష్పబిందువుల? నెత్తురుతీపుల నిండుగుండియల్
చిదులునె పుత్రికామరణభీషణదుఃఖభరాన్వితమ్ములై?

చనినదిబిడ్డ తండ్రిపగ సైపఁగలేమి; విపన్న భారతాం
గనయొడికెక్కి నిర్జరసుఖైకసుషుప్తినిబొందె; శాంతియే
జనపతి? తొంటిపున్నెమున జాయగసన్ దనియించి నేఁటిక
ర్పణమయిపోయె హైందవ పురాతనధర్మము ప్రజ్వరిల్లఁగన్.

మదసంపల్లసితేభకుంభచయ సమ్మర్దక్రియానైపుణీ
మదిరోన్మత్తమృగేంద్రదృప్తిశిత మస్మద్దూ్రక్షుఖడ్గంబు; నీ
హృదయక్షోణిని నల్లుకొన్న పరతంత్రేచ్ఛాక్తపంకంబులోఁ
బడనేడున్; భయమేలనోయి, నినుజంపన్ లెమ్ము, జీవింపుమా.

దురములోఁ బృథివీశుచే మరణమున్న
స్వర్గసౌధప్రవేశ కాహ్వానమోయి;
బ్రిదుకుమీ దాస్యనరకాన, పగరచేత
నడఁగి నరకప్రయాణివై వెడలుదాఁక.

[పృథివీశుఁడు పోవ నుంకించుచుండఁగ, వెనుకనుండి కఠినకంఠముతో ఘోరీ పల్కును]

ఘోరీ

తెరవును జేవగల్గి వలత్రించుక నింగికిఁబోవఁగల్గినన్
గురిగల వ్యాధమౌళి శరగుచ్ఛముఁబాఱి తొలఁగిపాఱఁగాఁ
దరమె విహంగరాజ, ప్రభుతల్ గురిపించెదు పృథ్వీరాజ, మృ
త్యురథము తోసి తెచ్చితిని దోలుకపొమ్ము తమఃపథంబులన్.

కలఁడీఘోరి; భయప్రకంపిత మనోఘాతమ్ముఁబోనాడుమా
పత్రియోద్రేకశరమ్ము వైతు జయచంద్రా, మిత్ర, పృథ్వీశుపై

[శరము విడచును పృథ్వీశునికిఁ దగులును]

జయచంద్రుఁడు

కలగాడియ్యది, పృథ్వీరాజుతలపైఁ గాలాహికోరల్ బలెన్
ములుకుల్ తాండవమాడు; మిత్రుఁడన మామూదేగదా,
యుర్వరన్.

పృథ్వీరాజు

[ఘోరినుద్దేశించి]

కన్నుల్ లొట్టలుపోయి ప్రాణములతోఁ గాబూలు పర్వెత్తినా
వెన్నోమార్లు; పరాజయాకృతివి, పృథ్వీశప్రతాపాబ్ధిలో
మిన్నుల్ మన్నును దేలిపోవుఁగద, భస్మీభూతుఁడైపోవె నా
కన్నుల్ గాంచినయంతలో నిలిచి ఖడ్గంబేయ నుంకించినన్ ?

శిరముఖండించి మేలి బొంగరముఁ జేసి
కాలయమపాశములఁ ద్రిప్పఁగలను, ఘోరి;
ఆటబంతిగ నాష్ఠును చాటలదర
విసరివైచెదఁ, బురుషుఁడై వెలికిరమ్ము.

[జయచంద్రునితో]

రిపురక్తాసవపానమత్తమగు ఢిల్లీ సింహాపీఠంబుపైఁ
గపటప్రాప్తజయాతిరేకమున నెక్కఁజూతువే, నీకనో

జిపయిర్ మ్లేచ్ఛులుమిన్నుదొ్రళ్లినటు లాజిన్ జేయరే, ఢిల్లిఁగేం
ద్రపురిఁ జేసి సమస్తభారత రమాకాల్యమ్ముల్లో ముగ్గరే?

ఢిల్లి, కనోజి, అజ్మీరు విధింబడినాశనమ్మందవచ్చు; సం
పల్లసితమ్ములై పరులపాలనలో విలసిల్లవచ్చు; నీ
పిల్లదనమ్ము మాత్రమికఁ భారతకావ్యమునందుఁ జీఁకటుల్
చల్లెడు నీచసర్గమగురా జయచంద్ర, తురుష్కభృత్యుఁడా!

ఆయువుగల్గు నాల్గుఘడియల్ రసపుత్రపవిత్రధాత్రిలోఁ
గోయిలపాటలట్లు రణఘోషలు సల్పి స్వాతంత్ర్యలక్ష్మికే
హాయినిగూర్చుటొప్పు; శరణంచు మహమ్మదునీడఁ జేరి ల
జ్జాయుతమూర్తివౌచు బలుసాకుభుజించుట సెల్లునేమొకో?

ప్రక్కవాటుగవిసరిన బాణమిద్ది
పూజ్యహిందూస్థలికె ద్రోకపోటుసుమ్ము;
ఉసురుగొట్టెదనీకు, నీ యుక్కడంచు
మ్లేచ్ఛులకుఁ; గాలలక్ష్మియే మేటిసాక్షి!

[క్రిందకొరగి మరణించును.]

జయచంద్రుఁడు

క్రొవ్విననాల్కతో మరణగుండగళంబున జారుచున్న నీ
పవ్వియు నిప్పెప్రేలితివి, ఆరెడుదీపము మండునట్టుగా;

నవ్వులపువ్వులం బొదివినట్టులు పెండ్లికుమారులీలనై
చివ్వనఁజన్న నీ మెయివసిండిసొబంగు లవెంతయింపులో!

జీవములేనిమృత్తికల చిత్రముపై మరలెత్తఁజేసి నా
పూవులతీవెబాలికను ముద్దులప్రోవును నీటముంచెదే?
నీవిజయప్రలాపములు, నీవిభవస్ఫురదంశుకప్రభల్
శ్రావణసూర్యతేజములురా మరణాంబుధరావృతంబులై.

ఇఁకజయచంద్రుఁడే విపుల హిందుతలమ్మునకెల్ల మేటి; బా
లికలిదె మోహనప్రణయలిప్తశిరీషశరీరచాలనో
త్సుకతమదించినట్లు కనుదోయికిఁదోఁచు, నిదేమి, యీప్రపం
చకమె పునీతమయ్యెనొకొ శ్యామలనవ్యసుధాస్రవంతులన్!

నేనునొనర్చెదన్ విజయనృత్యము, పృథ్వివిభుప్రతీకముల్
నానవహించి బూదియగునట్లుగ, నష్టను నాథుఁడేప్రమో
దానిలడోలికావిచలితాంగవిలాసమునొంద; సంగర
క్షోణికి వృద్ధజంబుకమొకో యన, వచ్చు...నమాత్యవర్యుఁడా?

మంత్రి

పరిభవవహ్నిలో శితకృపాణముఁద్రోసితి వద్ది నేఁటికిన్
జురచుర కాలిగ్రుచ్చుకొనె శూలముఁబోలె కనోజిగుండెలో;
ధరణిపతీంద్రబృందకలితంబగు పెండిలిమందిరాన నుం
దరమతి ఢిల్లినాథునకొనర్చిన గేలిఫలించెనిట్టులన్.

జయచంద్రుఁడు

పరువంబాఱిన యస్థిపంజరము రూపంబంది, వేదాంతశా
స్త్రరహస్యంబులు పల్కవచ్చెదవు; నిత్యంబిట్లెబోధింతు సం
గరవైముఖ్యము; రాజవాంఛితకుతర్కప్రాప్తపాపంబులన్
బరిహార్యంబులు సేసికొమ్ము ప్రమదాభ్యాసక్రియాభాసివై.

వమ్మై చన్నది పృథ్వీరాజుకళ నీ వాజ్నైఘృణింబోలె; దే
శమ్మైనాఁడు కనోజినాథ విజయచ్ఛాయావిముగ్ధమ్మై; లా
స్యమ్ముల్ సల్పు సమస్తభారతము నస్మద్వైభవోత్కర్షమై;
రమ్మాయీ ముదిఁబాపు నృత్యమయసంరంభంబునన్ నీవునున్.

మంత్రి

లేచెనుగాదె నీపయినె మ్లేచ్ఛుఁడు నెత్తినకత్తిదింపకే;
గోచికివచ్చి కాంచనదుకూలము దొంగిలిపోవునట్లుగా,—

జయచంద్రుఁడు

శరమువిదల్చి పృథ్వీపతిఁ జంపిన మిత్రుఁడుగాఁడె ఘోరి; నీ
వరమతిచెడ్డయట్టి ముదివగ్గువిధమ్మునఁ బల్కెదిట్టులన్.

మంత్రి

చాచిన నెత్రునాలుక విషంబునుగ్రక్కఁగ, వాఁడుసల్పు పై
శాచికనృత్యతాండవము చాలుఁగనోజిని మ్రింగివేయఁగన్.

జయచంద్రుఁడు

మఱిమఱిపల్కెదట్లు; తమమాటలనిక్కవమేదొ, బూదిలో
నొఱసెడు నగ్నితున్కవలె,మృణ్మయరత్నముఁబోలెఁ,దోఁచెడిన్.

మంత్రి

అవెయాలింపు మరేబితూతురగపాదారావకల్లోలముల్,
అవిగో ఘాతుకచింతనోజ్జ్వలితముల్ హాలాహలాశుప్రప్రా
గ్జ్వికారాంబక దీర్ఘపంక్తు, లదె ఘోరస్వాంతుఁడౌఘోరి; బం
ధువుగావచ్చి శిరమ్ములన్నలుము విద్రోహాత్మకుంజూడుమా.

జయచంద్రుఁడు

అతిథిగవచ్చి మందిరమునందలి వాపములెక్కవెట్టెఁగాఁ
బతితమనస్కుఁడితఁడు; నభస్సులబ్రద్దలుసేయు భీషణ
శ్రుతులిటువచ్చుచున్నవి; నిసుంగును నాఁకటిపోటుతీపులన్
గతికినబెబ్బులింబలె వికారముఖాకృతి హుంకరించెదే?

ఘోరి

[వెనుకనుండి]

పులుదొలగింపఁగల్గు నెఱి పొల్పును బొందికలేనిరెల్లు కొం
పలుగద రాజపుత్రపరిపాలితరాజ్యము లొక్కదానిపైఁ
గలిగినకారుదీర్చికొనఁగా మరుదుద్ధత కాలవహ్నికిం
లలఁగవియింపఁ బూర్ణకబళంబునఁగాకవి శాంతిఁబొందునే?

## జయచంద్రుఁడు

[పశ్చాత్తప్తచిత్తుఁడై]

మోసముచేసినాఁడవు భ్రమోత్సుకతన్ రగిలించి నాయెదన్;
సీసముగాఁచిపోసెదవె జీవసుధారసమిత్తునంచు; నీ
వేసరిసీకు, నాబ్రదుకునెల్లఁగలంచి నశించిపోయెఁ బే
రాసలుగాలిమేడలయి, యంబుదనీలము లెండమావులై.

జయచంద్రుండను నామధేయమపహాస్యంబౌకొక్కొ?
హిందూనృప
న్యాయవృక్షమ్మున వేరుపుర్వనయితిన్, మాణిక్యసౌవర్ణ సం
చయసంశోభిత సింహపీఠమునఁ దుచ్ఛాసక్తియై కంటకం
బయితిన్ నేఁటికి; భావికాలరమ బాష్పస్రావ సంతప్తగాన్.

ఫణమణిరాలిపోయి పసవాసిన నాగమువోలె, మ్లేచ్ఛునిన్
రణమునసాయమై భరతరాణ్మణిఁద్రుంపఁగఁగోరి, వానికిం
బణముగనొడ్డితిన్ భరతమాతయశస్సును; నేఁటికిట్లు భీ
షణముగఁ గోరలూడ్చిన విషాహివిధమ్మునఁ గ్రుంగిపోయితిన్.

అంభియొకండు తొల్లి విజయాంకితుఁడైన సికందరున్ ద్వీప
స్తంభబలిష్ఠమౌ భరతసౌధము పైకెగయంగఁజేసె; నా
యంభికిఁ దమ్ముఁనింబలె మదార్తుఁడనేఁటికి నేనెగా జయ
స్తంభములెత్తినిల్పితి విజాతికి లాతికి భారతోర్వికిన్.

ఏటియశాంతి, రక్తవిజయేచ్ఛ హరించితి; జాతిగుండెతో
మాటుచుఁ దోడివానిననిఁద్రుంచితి; నైననెడందఫాందునా
రాటము; మండుటెండవడి మ్రందియు నేసవి పొద్దువేళలన్
బీఁటలువాఱి నిప్పొసెగ వేడిమిఁ గ్రుక్కెడు నేలకై వడిన్.

శిశిరకుమార, నీవనుహాసింతువె శీతలవాతవీచితో,
బుసబుసలాడుచున్న వగపుల్ దహియించెడి నాయెడందపై
మసృణతుషారబాష్పకణమాలికఁ బేర్చెదె, పేర్చిపేర్చి మా
నసమును మంచుముద్దగనొనర్తువె జీవములాఱిపోవఁగన్.

"చలముంబూనియొనర్చనే సకలరాజస్థాన సమ్రాట్టుగా
బలశాలీనిను" నంటివే, భగతభ్మూపాల స్మశానస్థలిన్
నిలువంజేసితి కాటికాఁపరిగ; సందీప్తమ్ములై మండు పి
న్నులభస్మమ్ములు నన్నుఁ జుట్టినవిరా ఘోరీ, త్వదాశల్ బలెన్.

అదిగో—భీషణఘోషలేవొ వినవా; నార్తధ్వనుల్; మానినీ
హృదయాక్రందనముల్; గభీరమతి నారీహృద్వ్యసందేశముల్;
కదనోద్రిక్తవిహారగర్జనములున్; రామాతిరసాక్రరముల్;
హృదిభగ్నమ్మయి బూదిలోఁగలియు నేవేవో విషాదశ్రుతుల్.

ధవళయశోలసితమ్మౌ నభస్సు
నలుముకొన్నది దాస్య జలదతమస్సు;

జయచంద్ర హైందవక్షాత్రవశిరస్సు
వంగిచేసెడు మ్లేచ్ఛపతికి నమస్సు;

ప్రియసుతం జంపితిం బృథ్వీశుతోడ,
వాత్సల్యకోమల వదనయా తల్లి
భారతాంబను రక్తధారాప్లుతనుగం
జేసితిం గుటిలఘోరా సివిధాన,

భావిభారత దౌర్భాగ్యసంతతికి
నారువోసిన దుష్టనాందిని నేనె!

* * *

"వెన్నెలలిండ్లుకట్టుకొని వెల్గెడు మింటిబయళ్ళనుండి యీ
మన్నులకీడ్చి యీ వికలమానవదృశ్యముం జూపనెంతువే?"
యన్నవిధాన గంగ, యొడలంతయుం గన్నులుగాం, గనల్ మహా
పన్నత నశ్రురాసులుగం బర్వెం గనోజపురీదరీస్థలిన్.

దెసలందాంగిన చీంకటుల్ కెరలి పాండెన్ గాఢవిస్తీర్ణతన్;
విసరెన్ శైశిరభీష్మమారుతము పృథ్వీగోళ మల్లాడంగన్,
బసిమింబాసి లతాంతముల్ సుడిగిపోవన్ నిస్స్పృహాగ్రస్తతన్,
గుసుమవ్రాతము లేడ్చి నెత్తురులచిందుల్ రాల్చి యూగాడంగన్

గుమిగుములై మొయిళ్ళపఱువుల్ చెలరేగి తమస్సతీవిలా
సములను దీర్చిదిద్దెను; నిశాప్రియుఁగానని బెంగఁదారకల్
తను మురిపెమ్ములాడించనేఁ; దామరఁగాంచఁగ లేక తేఁటి, భృం
గముఁగనలేక తామర, వికారరహోవ్యథ వ్రీలెనత్తఱిన్.

చీఁకటితోఁటలం గాలిచెంగటఁ దుంటరితేఁటులెన్నఁడున్
దాఁకని నీలిపుష్పాదులఁదాల్చె నిశాంగనకంటికాటుకల్ ;
చీఁకటికోనలం జివికిచీకు నెడందల కాఱుచాయలా
పాఁకిన మబ్బుచాఱలె విభావరిపాపట రేగుముంగురుల్.

కుములుచు లాతివానియడుఁగుల్ పడియేడ్చెడు ఢిల్లిగద్దె గ
ర్భము వెలివచ్చు సిగ్గుల తెరల్ నిశిఁబర్వెనవే తటిల్లతల్;
తిమురుచు సింహాపీఠము చలింపఁగ నెక్కెడు నాతురుష్కపా
దముపదులున్ నభస్సులనదల్చెను గర్జనలై ధ్వనించెడున్.

